# రాజనివాసం

రచయిత:—

మల్లాది



ప్రకాశకులు

పసుపులేటి బాపిరాజు
పబ్లిషర్ అండ్ బుక్సెల్లర్

రాజమండ్రి

1944



[వెల 0-8-0

# సూచన

ఎంతకైనా తెగిస ఆడది— ఇంతసాహసమా— అంటాడు— మగాడు.

మగాడంటేనే మాయ— నమ్మినవాళ్ళు గోతులోదూకి నట్లే— పాములోతు నూతిలో దిగినట్లే— తెగనికత్తితో గొంతు కోసుకున్నట్లే— జన్మత్తగానేసరా— సిగ్గూ భిడియం— వుండా లంటుంది— ఆడది.

ఇందలి నిజానిజాలను వెల్లడిస్తుం దీరచన—

చదివి ఆడాళ్ళుమూతులు విరవద్దు— కళ్ళు పెళ్ళుమనద్దు—

మగాళ్ళు చంకలెగరెయ్యొద్దు— పళ్ళుబిగించద్దు.

'నిజం తెలియాలి'

రచయిత—



౧

టన్నానా టంకుచెలో - పూలవెన్నెలరా
కన్నావా దానిపోకు - గాజులున్నయిరా
ఇన్నావా మడిసిచుదుకు - మాటలెన్నదురా
మొన్నారేత్రి మద్దెకాడ - ముద్దిలిన్నారా॥

అని పాడుకుంటూ పోతున్నాడు కాలవొడ్డంటే భూషణంగాడు. ఆడికెప్పు డాబండిపాటలే—ఆసద్దే—ఇయ్యేల బల్లాళ్ళంతా కట్టుగట్టారు. అంచేత బండీ కుట్టానికి భూషణానిగ్గూడా పండగే. అయితేం జానెడులో పోయింది. దిక్కుమాలిన వ్యవహారం.

అంటూ విరగబడిన క్రాఫింగ్ ఎడంచేత్తో పైకెగదోస్తూ లుంగీ మధ్య మధ్య సవరిస్తూ సిజర్ సిగరెట్టు మూడేమూడు దమ్ములకింద పీల్చేసి వడివడిగా పోతున్నాడు. ఆసమయంలో వెనకాలనుంచి ఒకరిన శిలాఫలకంలాంటిచెయ్యి వాడిమెడమీదపడింది. ఇట్టేవెనుదిరిగి చూస్తే తనచిన్ననాటిస్నేహితుడు బలరామ్.

'ఏమోయి బలరామ్! ఈమధ్య నెక్కడాదర్శనాల్లేవు'

'నేనిక్కడలేనాిగ్ యిప్పుడు'

'ఎక్కడున్నావు?'

'మెడ్రాసులో వున్నాను'

'ఏమిటి గిరాకీ'

'గిరాకీయేముంది—నౌకిరీ'

'ఎవరిదగ్గర? ఏంపనిజేస్తున్నావు'

'ఒజమీాందారిదగ్గిరున్నాను. మనకి పెద్దపనేంలేదు. మాదర్జాగా వుందిలే'

'అల్లాటిచోటికి నన్నుగూడా నెట్టుకుపోదూ! నీచాటున పడుంటాను'

'చూద్దాం. ఇంకా నే కాలెట్టి ఏడాదికాలేదు. కొంతకాలం పోనియ్యి'

'బలరామ్ బండితోల్లేక చస్తున్నానోయి'

'ఎధవవృత్తిరా. అయిరా నెక్కువ'

'సగం గుఱ్ఱమేఊదేస్తుంది. సగంనేను'

'మాయింటిదగ్గిరాళ్ళేవవుతారు?'

'అళ్ళుతంటాలాళ్ళే పడతారు. మనం చిల్లిగవ్వ యివ్వం'

'మీనాయకునికాపం జేస్తున్నాడా?'

'ఆ! రోజుకు రెండుకళ్ళు జూస్తాడు'

'దాంతోవాళ్ళు కోజెళ్ళ గొడతారు'

'అంతే! మందిదర్జా'

'భాషణం—నీలాటిగాడు మెడ్రాసులో వుండలేడోయి'

'కారణం?'

'అక్కడెంత తెలివిగా మసలాలి'

'అదేట్టవుతుంది?'

'అక్కడాపామాపీవ్యవహారాలు సాగవ్'

'మనం వ్యవహారం జేస్తావా-నౌకరీ'

'అదోపట్టాన దొరుకుతుందా?'

'అందికేగా నిన్నట్టుకుపాకులాడుతున్నాను'

'నాకుమాత్రం సాధారణంగా దొరికిందా?'

'మతెల్లావచ్చింది'

'దానికో ఉద్దష్టానేశ్వాను'

'ఏంటది'

'చెప్తాగా ముందుమటి మనదర్జావిను'

'జీతం ఎంతిస్తారు'

'నలభై పేరు. ఎంతేనాకొడ్తాం'

'మంచిబాగుందన్నమాట నీపని'

'ఓ! భేషుగ్గావుంది. పొద్దున్నే లేవడం హాట్ వాటర్ తో తానం సోప్ గీప్ లవండర్ దర్జా, కాఫీతాగెయ్యడం మాఅయ్యగారికోసం ఎవరేనా వస్తే బిళ్ళో అర్ధబిళ్ళో రెండుబిళ్ళలో జేబులోగిరాటెయ్యడం. ఆయన్ని లోవలకంపడం 11 గంటలకే ఫస్టుక్లాసుభోజనం తాంపాకుబీడా సిగరెట్లు ఓ రెండుగంటలుపడక అయ్యగారూళ్ళోకిపోతే అమ్మగారితో ఊసులాడ్డం లేకపోతే కారేసుకొని షైరుపోవడం మనకికావలసినన్ని బట్టలు అయ్యగారితోనే కుట్టించుగోడం కూలాసాగాతిరగటం ఇంత కన్నేవిటోయిజన్మకి'

'ఆరేంకులస్థులు'

'రాజులమంటారు కాని మాఅయ్యగారికి జందెంపోగులేదు'

'నువ్వు శిష్టుకరణానివిగదా మీకులపోళ్ళందరకీ జందెంపోగులుంటాయి. నీకుందా'

'మనం తీసేసాము ఎందుకదీ?'

'జందెంపోగు లేకపోతేమాత్రం రాజులేమో?'

'అపోకళ్ళెక్కడాలేవు'

'ఆరికేమాత్రం జమీావుందేమిటి?'

'అదెవరిక్కావాలి కావలసినప్పుడల్లా బాంకికెళ్ళి చెక్కురాసి డబ్బుతెచ్చుకోడమే'

'డబ్బులేందే ఎక్కణ్ణుంచొస్తుంది'

'మాకెక్కడో జమీావుందంటుందమ్మగారు అవన్నీ నాకెందుకు?'

'దర్జాగానేవుంది నీపని ఇక్కడికెప్పుడొచ్చావు'

'నిన్న మేల్లో ఒచ్చాను'

'ఎందుకూ?'

'ఆరే పంజేసుకురమ్మని పంపారు'

'ఏంటది'

'అదిచెప్పకూడదులే రహస్యం'

'మనలోమనకేంటోయి' .

'మనకిద్దరికీ దాపరికంలేదుగాని మూడోకంటోటికి తెలవగూడదు. ఇందులో నీసాయంకొంచెం గావాలి-అందుకోసమే నిన్నువెతుక్కుంటూ మీఁయింటికెళ్ళాను లేవన్నారు అక్కడెవడో కనపడి ఇప్పుడే యిల్లా వెళ్ళాడంటే నీవెనకాలపడ్డాను. నువ్వు ఎగరేసుకుంటూపోతున్నావు ఎక్కడికో'

'అబ్బే. ఇయ్యాల బళ్ళోళ్ళంతా సమ్మెకట్టాం'

'ఎందుకు'

'బొత్తిగా కిరాయిలుతక్కువ. ఏంజూసినా బోలెడుధర. మ్యునిసిపాల్టీవోళ్ళపన్నుజూస్తే మమ్మల్నిమింగేస్తోంది. పన్నుతగ్గించమని మాకు మైలుకింత కిరాయి ఏరుపాటుచెయ్యమని అర్జీపెట్టాం. ఆళ్ళుఇనిపించుకో లేదు. సమ్మెకట్టాం'

'మీకేనష్టంగాదు'

'నష్టమే. రేట్లుహెచ్చింపుచేస్తే రెండురోజుల్లోకూడ దీస్తాం ఈనష్టం'

'సరేగాని మనమాచెట్టుకిందకిపోయి కూర్చుందాం'

'అవతల బళ్ళోళ్ళమీటింగ్—వెళ్ళాలి'

'నువ్వెళ్ళకపోతే అగుతుందేమిటి? ఇవ్వేళబండిలేనినష్టం నేముట్ట జెపుతాను'

'అయితేసదు నీమాటకెదురాడతానా?'

'ఆరావిచెట్టుకింద ఎవ్వరూ లేరు ఎవ్వరూ రారు పదు'

'పద ఇలాంటి రహస్యాలక్కడే మాట్లాడుకోవాలి'

అంటూ బలరామ్, భూషణం ఆరావిచెట్టుకిందికెళ్ళి కూచున్నారు. అలా కూర్చోడానికి వంగినప్పుడు బలరామ్ తనజేబులోని మనీ పర్సు భూషణం చూడాలని క్రిందికి జారవిడువాలనే విడిచాడు. అది పడడంతోటే ఓమాటు దాన్ని విప్పి నోట్లుపైకితీసి లెక్కెట్టి మళ్ళా జేబులో పెట్టుకున్నాడు.

భూషణానికా నోట్లకట్ట చూడటంతోటే కళ్ళు జిగేలుమన్నాయి. బలరామ్ ఇప్పుడెట్టిదర్జాలోవున్నాడో భూషణానికి కళ్ళకిగట్టినట్టుయింది. భూషణం— అదృష్టమంటే నీదే. కార్లుదగ్గిర జనాన్ని సప్లయిచేసి రోజుకి అర్థా పావలా గోక్కునేముండావాడికి జేబునిండా నోట్లకట్టలే. రోజులు బాగుపడితే ఎంతకావాలి ఏదోకొమ్మన్నట్టుగున్నాడు. దులిపేస్తున్నాడు.

అని లోలోన ఆలోచన్లుచేసే భూషణాన్ని బలరామ్ బుజాలట్టు గూపి అల్లా ఆలోచనలోపడ్డావేమిటి? ఇక్కడికెందుకొచ్చావో మరిచి పోయి అన్నాడు.

'ఆలోచనేంలేదు. నీఅదృష్టానికి ఆచ్చర్యంపడుతున్నాను. కార్లు దగ్గిర బ్రోకరుగావుండి రోజుకోటీ అర్ధానసంపాయించుకొని పొట్టోసుకునే రోజులోయి నీకు మంచిరోజులొచ్చాయిగదా అని'

'సరే! ముందు నేనుచెప్పేదంతావిను. రాజమండ్రీ నేనిప్పుడు అకాత్తుగా ఎందుకొచ్చానంటే నెలరోజులకిందట మెడ్రాసుకి ఓషోకేళా పిల్లొచ్చిందెక్కణ్నించో— కోమలవిలాస్ అప్స్టెయిరులో దిగింది. మా అయ్యగారుజూచి దానికోసంవలేశాడు తెగతిరిగాడు. లాభం లేక పోయింది. సంసారో సానో యేంటో తెలీదు. ఆమె బసకెళ్ళి మాటాడాలని ఎంతప్రయత్నంచేసినా అవకాశం చిక్కలేదు. తుదకే ఆహోటల్ సర్వెంటుని పట్టుకుని సంగతంతా కూపీతీశాడు. తియ్యగా తియ్యగా ఆ

పిల్ల ఈవూళ్ళోవో పెద్దఉద్యోగస్తుడు భార్యనీ మెడ్రాసుచూడ్డానికొచ్చిం దనీ వాడు కనుక్కొని చెప్పాడు. ఆమాటలు మాఅయ్యగారు నమ్మలేదు.

ఇంకా వాకబుచెయ్యగా కాలేజీలో చదువుకునేకుర్రాడితో లేచొచ్చిందని తెలిసింది. మగాళ్ళెవరూ వెంటఉన్నట్టుగా అగుపించలేదు. ఎక్కడికి టీపీకారుకేనా సెళ్ళేదికాదు. ఎప్పుడూ హోటల్ లాడ్జిలోనే వుండేది. పట్నంచూడ్డానికొస్తే ఏకారుమీదో రిక్షామీదో తిరగడ్డా అదేంలేదు చివరకి అయ్యగారు సాహసించి నన్ను పంపారు. నేవెళ్ళి మీ దెవ్వార్రని ఇక్కడకెందుకొచ్చారనీ అడిగాను. అనువ్వూ మినువ్వూ చెప్పలేదు. నాలుగురోజులుకిందట మెయిల్లో బయలుదేరిక్కడికొచ్చే సింది. మాకు తెలియలేదు. తరవాత రాజమండ్రీ వెళ్ళిపోయిందని ఆహోటలుకీపరు చెప్పాడు. మరింకా ఆమనిషి చాలానిబ్బరమైందనీ సరియైనవాడెవడైనావెళ్ళి ప్రయత్నంచేస్తే లొంగుబాటవుతుందని చెప్పాడు.

మాఅయ్యగారెంతడబ్బయినాసరే దాన్నికొట్టుకురమ్మని నన్ను పంపించారు. వచ్చాను. ఆమెను ఆమెవున్నయింటిని గురుపట్టాను. కాని అదోప్లీడరుగారిల్లు. ఆయనపేరు మదనగోపాలరావునాయుడు. ఆమె ఆయనభార్యట. ఏదోపెద్దఉద్యోగం. వయస్సు 60 ఉంటాయి ఆయనికి. ఆమెకి ఇరవైయేళ్ళుంటాయి. ఆమెను మెడ్రాసుకొట్టుకొనిపోయామంటే మనకి బలేఛాన్సు.

'నన్నేంజెయ్యమంటే అది చేస్తాను. చెప్పు'

'నువ్వు బండికావాలాఅనడుగు. ఆమె బయటికొస్తుంది. అప్పుడు నేనొచ్చి మాట్లాడుతాను. ఆమె బయటికిరాకపోతే అల్లాగేంలబడి వుండు. నాయుడుగారు క్లబ్బునుంచి రాత్రి 10 గంటలదాకా రాడు.

'బయటికొస్తే ఏంచెయ్యమన్నావు?'

'అమ్మగారూ! అయ్యగారికోసం ఎవరోవచ్చారు. కండని చెప్పు'

'వారులేరు పొమ్మంటే'

'అలాకాదండి ఏదోఅర్జంటుపని ఆడంగుల్తోనైనా చెపతారను'

'అప్పటికీ వినిపించుకోకపోతే?'

'నన్ను పిలు. చుట్టుపక్కలెవరైనాడున్నారేమో వరకాయించి జాగ్రత్తగామాత్రం చూడు'

'అలాగేచేస్తాను'

'నేను సరీగ్గా ఆప్రాంతానికి 7—30 గంటలకొస్తాను. నువ్వుకూడా ఆవేళకేరావాలి. ఇదుగో! ఈపదిరూపాయిల నోటుతీసుకో! భూషణం నేను ఫుల్‌డ్రెస్సుమీదుంటాను. ఆప్రక్కనే తచ్చాడుతాను. నన్ను మాత్రం గుర్తుపట్టాలి'

'ఓ! ఆమాత్రం తెలివి లేదనుకున్నావా భూషణానికి?'

'నీసంగతి నాకు తెలియదూ! ఏదేనా సుతిమించి రాగానబడితే నీబండి మేఘాలమీద ధవళేశ్వరంలో వాలాలి. బండీతీసుకురా?'

'అలాగే'

అని భూషణంలేచాడు. తరవాతబలరామ్ లేచాడు. ఇద్దరూ చెరోత్రోవని ఊళ్ళోకిపోయేరు'

ఈభూషణంగాడు ఇల్లాంటిపనులు చెయ్యడానికి పక్కాముని పే. అందులో పదికూడా పారేశాను. రాకండావుంటాడా! ఇదిమూర్చి తప్ప దాగి నిద్రకిబడతాడేమో? ఎలాగేనా ఈపని సాధించామా అంటే ఎధవ డబ్బుకేంగాని మనరొట్టె నేతిలోగాదు—తేన్లోపడుతుంది. అయ్యగారీమె వల్లోబడి కొట్టుకుంటూంటే నామనస్సులోకోరిక నెరవేరడానికడ్డేమీ వుండదు.

అనుకుంటూ బలరామ్ నాళంవారిసత్రింలోనికి జేరుకున్నాడు. అప్పటికి 6 గంటలయింది. తనుబసదిగిన గదిలోకెళ్ళి దుస్తులుమార్చివేసీ హాంగా మూలోకి దిగాడు.

బలరామ్‌నివిడిచిపెట్టి పదిరూపాయిలకాగితం పదేపదేచూసు కుంటూ భూషణం తిన్నగా సారాకొట్టుకు దారితీసాడు. అదృష్టమంటే బలరాముడిదే. జేబునిండానోట్లే. పదిరూపాయిలకాయితం చింపిరికాయి తంలా చూస్తున్నాడు. వెలుగువెలుగేస్తున్నాడు. ఎంతనమ్మకంగా పంజెయ్యకపోతేను అన్నినోట్లు చేతికిచ్చి ఒదిలేస్తారా? ఇంకా వీడిదగ్గిర లాగాలి. వదలకూడదు అనుకుంటూ సారాకొట్టులోకిదూరి మోటా దులు నాలుగుడ్రాములెక్కించి, వాడికివ్వవలసినకిరాయి గిరగిరాతిప్పి పారేసి బయటకొచ్చాడు.

అవ్వేళ బండికట్టకూడదని పావుగంటకిందటిదాకా జ్ఞానంవుంది. పదిరూపాయిలనోటు చేతులోపడటంతోటే సమ్మోమాట చంకనాకి పోయింది. సారాకొట్టుకోపోగా మిగిలిన 8 రూపాయిలు సంచిలో వేశాడు. తిన్నగా మూడుముక్కలాడేచోటి కెళ్ళాడు. అరగంటలో అయిదురూపాయిలు గల్లంతు. ఇక మూడున్నాయి. అప్పటికి 7 గంట లయింది. అప్పుడే ఆటప్రారంభించిన పోకంపెసీదగ్గిరకెళ్ళి పదినిమిషాలు చూసి నింపాదిగా బేడకోగాజుచొప్పునకొని ఆటాడ్డం మొదలెట్టాడు. అరగంటకల్లా రెండుచేయి దాటిపోయాయి. అప్పటికి కొంచెం మనసు లొంగుబాటుకొచ్చింది.

తిన్నగా యింటికెళ్ళి బండికట్టుకొని ఏంరా! భూషణం! బండెక్కడికిరా అని తోటిబళ్ళవాళ్ళు వెంటబడి పిలిచినా వినుపించుకో కుండా బలరామ్‌చెప్పిన గుర్తుప్రకారం 8 గంటలయేసరికి బండి అప్రక్కని నిలబెట్టి ఆగుమ్మంముందర అటూయిటూ తిరుగుతున్నాడు. అవ్వేళ

వ్వాళ్ళేమొక్కడా గుఱ్ఱంబండి కనుపించకపోవడంచేత మొహంవాచిన వాళ్ళమోస్తరుగా బండికడతావా—బండికడతావా అని జనంమూగి పోయారు. ఎవరికీబండి కట్టేదిలేదు. ఈయింటోరిక్కట్టుగొచ్చానని వీధి చీడీలమీద బైఠాయించాడు.

౨

'బలరామ్ ఎక్కడికెళ్ళాడండీ?'

'రాజమండ్రి వెళ్ళాడు?'

'ఎందుకు?'

'ఎందుకేమిటి? వాళ్ళవాళ్ళనిచూడ్డానికి'

'చెప్పకుండానే వెళ్ళాడా?'

'ఎందుకుచెప్పలేదు. నాతో చెప్పాడు'

'మీతో నేచెప్పాడన్నమాట—చెప్పాలన్నమాట—ఇంకెవరితోనూ చెప్పక్కర్లేదన్నమాట'

'చెప్పక్కర్లేదని కాదు తొందరగా వెళ్ళాడు'

'ఎంతతొందరైతేమాత్రం ఊరికెళ్ళేవాడు చెప్పకుండావుంటాడే'

'అవకాశంలేకపోయింది. వాళ్ళవాళ్ళెవరో వచ్చారు. నాతో షికారుకొచ్చి అలాగేవెళ్ళిపోయాడు'

'ఎప్పుడొస్తాడు?'

'వారంరోజుల్లో వస్తానన్నాడు'

'అబ్బా!'

'ఇంటికివెళ్ళినవాడు వారమేనావుండకుండావస్తాడు?'

'అక్కడెవరూలేరని చెప్పాడే'

'నాఅన్నవాళ్ళు లేకపోతే చుట్టాలుండరూ?'

'నా కేంపనిలేదు. నాకోసం ఎదురుచూచేవా రెవ్వరూ లేరన్నాడు'

'పుట్టి పెరిగినచోటు మనస్సుండబడుతుందా?'

'అలా చెప్పండి'

'ఎలా చెప్పినా వకటే తెలిసినవాళ్ళకి తెలియనివాళ్ళ కెంత చెప్పినా బూడిదలో పోసినపన్నీరు'

'నాతో చెప్పకుండా ఎందుకుపంపించారు?'

'నీతో చెప్పి పంపాలా యేమిటి?'

'తప్పకుండా చెప్పేవంపాలి. వాడు మీనౌకరుగాదు రాణివాసం తాలూకు నౌకరు'

'రాణివాసంతాలూకునౌకరని వాడిమొహాన రాసుందేమిటి?'

'రాసుండేదేమిటి? నేను కుదుర్చుకున్నాను. నాపర్మీగాని మీకు చాకిరీ చెయ్యడానికి వీల్లేదనలు'

'పాపం రాణివాసం'

'రాణివాసంకాదూ?'

'రాణివాసంఅంటే బయటికిరాక సూర్యుడిమొగంకూడా చూడని వాళ్ళకు చెల్లుతుందికాని సినీమాలకి షికార్లకి పొయ్యేవాళ్ళకి రాణివాసమేమిటి?'

'అంతా వితండవాదన ఆడాళ్ళుగుమ్మంకదలగూడదు. సినీమాలు చూడకూడదు'

'అలావుంటేనే రాణివాసం'

'అలాగేవుంటారు. నామనిషిని నాసెలవులేకుండా పంపడమేమిటి?'

'నీమనిషేమిటి?'

'నాకుచాకిరీకోసమే నేను కుదుర్చుకున్నాను'

'అయితే నువ్విప్పుడనేదేమిటి?'

'నాకుచెప్పకుండా యెందుకుపంపించాలని అడుగుతున్నాను'

'అలాఅడగడానికి నీకు హక్కులేదు'

'నాకు హక్కుందిగనకనే నేనడుగుతున్నాను'

'అదేలేదని చెవుతున్నాను'

'నాకుహక్కులేకపోవడమేమిటి? నాడబ్బుతో వాణ్ని పోషిస్తున్నా'

'మాటమాటకీ యిదో దెప్పరికం'

'సమయంవచ్చినప్పుడు దెప్పకూరుకుంటారా?'

'ఈసారి యిల్లాటిఘట్టంవస్తే చాలాదూరం వెడుతుంది'

'వెడితేవెళ్ళుగాక జడిసేదెవర్కిక్కడ?'

'నీకు జడుపులేదని నాకుతెలుసుగాని యువతలవాళ్ళకూడా అంతేనని తెలుసుకోవాలి'

'అంత అవసరమేంలేదు'

'ఆరోజులూవస్తాయి'

'వచ్చినప్పుడు చూసుకుందాం'

'చాలా ధీమాగామాట్లాడుతున్నావ్'

'ధీమాగాక మరేమిటి?'

'అలాటిపొంగేవొద్దన్నాను. ఈఐశ్వర్యం శాశ్వతంగాదన్నాను'

'బొళ్ళోయికబుర్లెన్నైనా చెప్పొచ్చు'

'వాజమ్మా! నోరుముయ్యవోయ్'

'నోరుమూయించేదాకా వచ్చిందికాబోలు హయాం'

'హయాంగాకేమిటి? నేను మొగుణ్ని నీకు పెళ్ళాన్ని నాయిష్టం వచ్చినట్లు హయాంచేస్తాను'

'నామీద హయాంచెయడానికి నీకేమీఅధికారంలేదు'

'ఎవర్నైనాఅడుగు తెలుస్తుంది'

'నాకడగవలసినఅవసరంలేదు. అవసరంవొచ్చినవారే అడుక్కోవాలి'

'అదుక్కొంటా నీపొగరణచాలి'

'నాపొగరణచడానికి నీచిల్లిగవ్వ నేనుతినడంలేదు'

'తినకపోతేమాత్రం లాప్రకారం నీమీద నాకు ఎందుకైనా హక్కుంది'

'అదేలేదనిచెపుతున్నాను. నాడబ్బుతో నిన్ను నేనుపోషిస్తున్నాను గనుక నిన్ను అదుపాజ్ఞలలో వుంచాలంటే నాకేహక్కుంది'

'నీడబ్బు నేనేంతినడంలేదు. ఇదంతానాదే'

'ఎక్కణ్ణుంచొచ్చిందో?'

'ఎలావస్తేనేమిటి? ఇదంతానాదే'

'నాదేలంటే అయిపోతుందికాబోలు'

'అయిపోయేవుంది ఇంకాఅయేదేమిటి?'

'ఏదీ! చూతాం ఏమయిందో?'

'నేనిప్పుడుపొమ్మంటే నువ్వవతలకిపోవాలి'

'అలాగేజరిగేటట్టుందెప్పుడో?'

'నువ్వేనాజరిగించడం: వో! చాలామందినిచూశాను'

'అయ్యో! చూడకేం. మనసంగతి తెలియదుకాబోలు'

'ఏమిటోయి తెలిసింది నీమొహం'

'ఏం తెలియాలి ఆడదానిడబ్బుతింటో దానిమీదగంతులు'

'ఆమాటంటే చెంపలువాస్తాయి'

'వాచవుమరీ ఏంఝూసుకొనో ఆపొగరు'

'నాకేం దర్జా ఉండడానికిమేడ— తిరగడానిక్కారు జల్సాకి కావలసింత డబ్బు'

'ఇవన్నీవూడతాయి ఒక్కక్షణంలో తలుచుకుంటే'

'ఎలావూడతాయోచూస్తాను'

'అప్పుడుచూసేది ఆకాశమే'

'ఆకాశమే చూస్తానో నీఅంతమే చూస్తానో'

'నాఅంతంచూసేవాడు పుట్టిరావాలి'

'అదేం పెద్దమహాద్భాగ్యంకాదు. ఎందుకాదదని ఊరుకుం టున్నాను'

'ఊరుకోక చేసే దేవిటీ?'

'ఏంచెయ్యాలో అదేచేస్తాను'

'నీవల్ల ఏమీకాదు'

'అదీచూద్దుగాని'

'మింగ మెతుకులేదుగాని మీసాలకి సంపెగనూనిట'

'నాకర్మమేంగాలింది'

'ఒడిగ్గామాట్లాడితే వేదాంతం'

'వేదాంతం నీబోటి వెఱ్ఱిచెవలాయిలికి'

'వెఱ్ఱిచెవలాయినే మరిప్పుడు'

'ఒకప్పుడింతకన్న మహాఏమిటోగొప్ప'

'తినమరిగినకుక్క తెగమొరిగిందట'

'మొఱగదు మరి మొఱిగూరుకోదు కాటేస్తుంది'

'ఈకక్క కాటుకిమందు చెప్పుదెబ్బేగా'

'నోరు మహాలేస్తోంది'

'తిన్నగావుంటే ఎందుకులేస్తుంది'

'ఈజన్మకే తిన్నగావుండటమంటో లేదు'

'నాకేం దర్జాగాపోతున్నాయిరోజులు'

'రోజులే'

'మనకెప్పుడూ యిల్లాగేపోతాయిరోజులు'

'తేఱగాదొరికితే ఎవరికెళ్ళవు'

'మా తెలివితేటలవల్లే తేఱగాదొరుకుత'

'అయ్యో! తెలివికేంలోటు కావలసినంత సాపాటులో'

'దాన్లో ఒకరుతీసిపోతారాయేమిటి?'

'దర్జాగా స్వంతంకాబట్టి నాయిష్టం'

'మనకీఅంతే'

'జరుగుతుంది కొద్దిరోజుల్లో'

'వెంట్రుక బరాబర్'

'అప్పుడంతేగతి'

'మనకేం భయంలేదు'

'భయానికేముంది పాడిందేపాడరా'

'మనకీజన్మకేమీలోటుండదని ఆబోధ్రిజ్యోతిష్కుడు డొక్క తెగేసిచెప్పాడు'

'పాతికో పరకో లాగి'

'కర్మం వందా'

'ఏంతేనాయివ్వచ్చు కష్టపడినసంపాదన కాదుగా'

'కష్టంగాకపోతే కట్నంకింద ఏభై వేలుచ్చుకున్నాను'

'మోసంజేసి'

'నేనెవణ్నీ మోసంజెయ్యలేదు. మనదర్జాచూసిచ్చారు'

'మండిపోతోందిదర్జా వీధిలో కెడితే కుక్క—'

'నోరుముయి'

'మూస్తా ముందుందిముసళ్ళపండగ'

'మనకేవీ అలాటికషభిషల్లేవు'

'ఇదైపోతేసరి చిప్పా కత్తా'

'మళ్ళీకొడతాం ఓఛాన్సు'

'ఇక వప్పాలుడకవు'

'మనచేతిలోవృందావుత్రం రామప్రసాద్ తక్కువవాడుగాడు'

'ఓ! కబుర్లకేం తక్కువలేదు'

'దాంతో నేనూడ్చేసాం మామావాళ్ళని,

'మళ్ళామనకంతేకని పెట్టుగునుంది'

'రామప్రసాద్ దగ్జా ఎఱగందెవరు?'

'అక్కడంతా ఎరుగుదురు'

'అక్కడమా ఒందుకోయి యిక్కడిసంగతిగాని'

'క్రొద్దికోజులుపోతే కంపుకంపు'

'నువ్వనుకుంటున్నావు'

'నేననుకోడంగాను. దేవుడు మూడుపంత్తులారాసిందే'

'వాడిమొహం నీమొహం ముందగ్గిర వాడర్థణాకిమారదు'

'ఔనుమఱి. మనపశ్వర్యంముందు అష్టయిశ్వర్యాలుకల భగవం తుడోలెక్కా?'

'నిజానికంతే'

'అంతే నేనన్నట్లు'

'ఈళ్ళుపీనుగువు నీలెక్కవడికి'

'నేనాఋళ్ళుపీనుగుని నువ్వా?'

'మనంయెప్పుడూకాదు'

'ఇలాంటివాగుళ్ళువాగితే గోడుకొస్తాపై నేస్తాను'

'అంతే– ఇహనేంజేస్తావు?'

'ఇటువంటికృతఘ్నుణ్ణి ఏంజేసినాతప్పులేదు'

'నువ్వేంజెయగలవు. ఆడపీనుగువి'

'దానిచుఱకతగిలితేగాని ఈమదోన్మత్తతచావదు'

'ఈమదోన్మత్తత వదిలించేదీకూసుబాలమ్మే?'

'ఈబాలాంబే యింత కూడెడుతోంది'

'పాపం. దయదలచి'

'కాకపోతే'

'అంతకుముందు చచ్చిపోయామ్'

'అందుకు సిద్ధంగాలేదంతే'

'ఇప్పుడీవిడ విడగొట్టేస్తోంది'

'విడగొట్టబట్టే కార్లమీదపికార్లు— క్లబ్బుల్లోదర్జాలు — వెలుగు తోంట'

'ఎప్పుడూ ఓలాగేవెలిగింది మనకి'

'వెలుగుతుంది'

'మనకేమోయి రామప్రసాద్ కోటీశ్వరుడంటారు బైటకెడితే'

'ఇంటిపేరు ఘుమఘుమలవారు, ఇల్లంతా గబ్బిలంకంపూను'

'వంకరటింకరపేలావన్ను పేలకు'

'మాటలు విసురుగారానివ్వద్దు'

'చచ్చినట్టుపడుండు'

'అలాగేవుండవలసొస్తుంది'

'వీడా రామప్రసాద్— వీరాధివీరుడు— కలియుగాభిమన్యుడు— కాంతామన్మథుడు—తారాశశాంకుడు'

'అహా! ఏమి అందచందాలు అద్దాన్నవౌతున్నాయ్'

'లేకపోతే వీధమ్మటపోతూంటే ఓచేతివిసుర్లు నోటిపిలుపులు'

'ఈసలకూబరుణ్ణిచూచి'

'సన్నాసినలకూబరుడు మనకాలిగోరుకిపోలడు'

'తన్నుతాను పొగుడుకొంటే ... ...'

'మనం కంతువసంతజయంతాదుల్లోలెక్క'

'తేలిగావస్తే పొట్టనిండామెక్కి— సానివాడల్లో చవటముండల గుడిసెల్లో దూరేరకం'

'ఫో! ఫో! పుండాకోర్'

'ఒక్క మాటు యోచించిచూసుగుంటే రంగుబయటపడుతుంది'

'పోవోయి వక్కాలు సాఫవుతాయి'

'నీవుపిటపిట్లాడుతుంది'

'ఏదో దగ్గిరపడింది'

'అలాగేకనిపిస్తోంది'

'నీతాతలుదిగిరావాలి'

'ఏంగొప్పవాడండి'

'గొప్పగాక నాకేంలోటు'

'మనకేంలోటులేదు. అయిదోతనంతక్కువ'

'అది నీజన్మకి'

'నాకెప్పుడూలేదు. అది యితరసొమ్ముదిని కళ్ళుమూసుకుపోయి వాళ్ళనెదిరించి అపకారంచేసేవాళ్ళకి'

అంటూ బాలాంబ అక్కడినుంచిలేచి వెళ్ళిపోబోతూంది. రామప్రసాద్ లోపలకుపోయే బాలమ్మను సందిటబట్టి యెత్తి కుదెయ్యాబోయాడు. ఆమెచటాలున అందుబాటులోవున్న వ్రాచందుకొని రామప్రసాద్ నెత్తిమీదకొట్టింది. ఆదెబ్బకి తాళుకోలేక అతడు క్రిందపడిపోయాడు. అతనిపరిస్థితి యేమైందోచూడకుండా బాలాంబ రివ్వున మేడమెట్లెక్కేసింది.

రామప్రసాద్ ఏకులస్థుడో ఎవరికీతెలియదు. అతడు పసితనంలోనే తలిదండ్రులు పోవడంచేత దిక్కులేక దీనదశలో మదరాసువచ్చి ఓపెద్ద లాయరుగారిదయ సంపాదించి— ఏదోకొంతచదివాడు. అదబ్బలేదు. అస్తమానమూ లాయర్ల సంభాషణ వినడంచేత— అసలేకొంత మెదడున్నవాడవడంచేత— పిల్లిమీదఎలకని— ఎలకమీదపిల్లిని యెక్కించి నింపాదిగా చిన్నచిన్న ధాన్యాలుకొడుతూ రోజువెళ్ళదీసేవాడు. ఇతని అల్లరిచిల్లరిపనులు— చిలిపిచేష్టలు— చూచి ఆయన వెళ్ళగొట్టాడింట్లో

నుంచి— అక్కణ్ణుంచి బెంగుళూరొచ్చి— తానో పెద్ద వ్యవహర్తనని—
పట్టాలేదుగాని ప్లీడర్లెవరూ మనకిచాలరని— కోతలుకోస్తూ సంపాదిగా
కచేరీలచుట్టూతిరిగి ఏవోకాగితాలుగాసి సాయంత్రాకి పదీ పదిహేను
కళ్ళచూసేవాడు. అతడెంత దూబరాగాఖర్చుపెట్టినా కొంతమిగిలేది.

తర్వాత నెమ్మదిగా కూడబెట్టుకుంటూవచ్చి ముందు చిన్నవ్యా
పారం మొదలెట్టాడు. అది అడుగ్గడుక్కీ కలిసొచ్చింది. స్వల్పకాలంలో
కొంతడబ్బార్జించాడు. దానిఆసరాన పెద్దలతో స్నేహాలారంభించాడు.
పదిమందిలో తలెత్తుకొని తిరగడం మొదలెట్టాడు. ఇతడో పెద్దవ్యాపా
రస్తుడని— కొన్నిలక్షలాస్తుందని లోకంనమ్మేట్టు హంగులన్నీ యేర్పాటు
చూచుకొని— ఎక్కడేనా పెళ్ళాడదామని యత్నిస్తోంటే బాలాంబతండ్రి
యితనిఖ్యాతివిని దర్జాచూసి పిల్లనిస్తాను పెళ్ళాడుతావా? అనడిగాడు.
చాలామంది యిస్తామంటున్నారు. తమరేం ముట్టచెపతారంటే యాభై వే
లిస్తానన్నాడు. బాలాంబారామప్రసాదులకి పెళ్ళయింది.

ఇప్పటికి నాలుగేళ్ళయింది. మదరాసులో మకాం పెట్టాడు.
బాలాంబతండ్రి కూతురికి అరణం రెండు లక్షలిచ్చాడు. అంతేగాక
సాలీనా 10 వేలు ఆదాయంవొచ్చే చిన్నజమీకూడా యిచ్చాడు. ఆది
లో ఏకొద్దికాలం కలిసిమెలిసున్నారో అంతేగాని రోజూ కొట్లాట.
అయ్యగారి ప్రేలాపాలు— అమ్మగారి రుసరుసలు— నడివీధికెక్కలేదు
గాని యిప్పుడా పరిస్థితులలోకొచ్చింది. దీనికంతకీ ఆదికారణం— బాలాం
బారామప్రసాదులకు వివాహమైన కొంతకాలనికి, రామప్రసాద్ బండా
రం బయలుపడిందో వ్యవహారంలో.

రామప్రసాద్ కులంతక్కువవాడని — మోసగాడని— ఇతడిదగ్గిర
డాబుసరేగాని— ఎట్టిపి ఏగాణీలేదని_ బాలాంబతండ్రికి తెలిసింది. అతడు
కులీనుడవడంచేత అల్లరిలేకుండా, పిల్ల దేనికీదిక్కు కదలకుండా పంపేశాడు

రామప్రసాదుతో. అయితే బాలాంబ తండ్రుబ్బుతో మదరాసులో మే డొకటి కొన్నది. అప్పటికింకా యిద్దరికీ ఎడమొఖాలు పెడమొఖాలు లేకపోవడంచేత—ప్రసాద్‌ని మక్కువగానేచూస్తో— అతనిఖర్చులకో పాతికవేలిచ్చి, షికారుకి కారోటికొంది.

కొద్దిరోజులకే రామప్రసాద్ ఆమెను అనేకవిధాల కట్టడిచెయ్యడం మొదలెట్టాడు. తానేమోషికార్లకని— క్లబ్బులకని— పోకిలకని— పోయిపోయి— ఏనిశిజామునో—యింటికొచ్చేవాడు. వచ్చినా బాలాంబ ఉందో ఊడిందో కనుక్కోకపోవడమేకాకుండా — సౌఖ్య—చాకర్ల మెగుట ఆమెను నిరసించేవాడు. అంతవరకుకూ తనభర్త కులంలేనివాడనే అంశంతప్ప యితరమేమీ తెలియకపోవడంవల్ల పూర్వకర్మసుకృతం అని ఓపికపట్టింది. రానురాను రామప్రసాద్ జులాయిగా తిరుగుతున్నాడని— తనవైపు పెడమొఖంపెట్టాడని — అసహ్యించుకొని యెదురుతిరగడం మొదలెట్టింది.

ఇంతట్లోకే ఓరోజున రామప్రసాద్ కారు యింటిదగ్గరేవిడచి పోవడంచేత బాలాంబ కారుమీద సినీమాకు బయలుదేరింది. కారు శరవేగంలో వెళ్ళేసమయంలో డ్రైవరు అజాగ్రత్తవల్ల ప్రమాదం సంభవించింది. డ్రయివరు వెంటనే ఈలోకం విడిచిపెట్టేశాడు. బాలాంబమాత్రం కారులోనుంచి అదురుపాటుకి తృళ్ళి— అయిదారుగజాల దూరంలో పడింది. కొద్దిదెబ్బలుమాత్రమే తగిలాయి.

నాటికై దారు వారాలక్రిందట బలరామ్‌అనే ఓశిష్టుకరణం రాజమండ్రీనుంచి మదరాసువచ్చాడు. అతడు రాజమండ్రీలో కార్లదగ్గర బ్రోకరుగావుండి జీవించేవాడు. ఏదో ఉల్టాసీదా టిక్కెట్టుమీద మెడ్రాసు వచ్చి ఓపూటతిని— ఓపూటతినకా— తిరుగుతూ తుదకు ఓవాచీలకంపెనీలో వాచగుగా ప్రవేశించాడు. ఆకంపెనీకి దగ్గరగానే బాలాంబకారు

బోల్తాకొట్టింది. కారులోంచి త్రుళ్ళి తనకంపెనీయెదుట చీకీమీదపడ్డ బాలాంబను బలరామ్ లేవదీసి— తనకంపెనీ యజమానిఆజ్ఞమీద—ఆమె కుపచారాలుచేసి— తెప్పరిల్లజేసాడు.

బాలాంబతేరుకుని బలరామ్‌కు కృతజ్ఞతతెలిపి వెళ్ళిపోయింది. అయితే తన ప్రాణరక్షకుడైన బలరామును ఆమె మరువకుండా ప్రయత్నించి హెచ్చుజీతంమీద తనయింటినౌఖరుగా ఏర్పాటుచేసుకుంది. ఆ బలరామ్‌నుగురించే యిప్పుడీయుకటావికటవు దంపతులు జుట్టూ జుట్టూ పట్టుకున్నంత గలాభా పెంచుకున్నారు.

ఏమయితేనేమి— ఆదంపతులిద్దరికీ ఒకరిమీదొకరికి— అసహ్యాం-నిర్లక్ష్యం- అసూయ— అంతా యింతా అనకుండా ఏర్పడి— సంసార సాగరానికి చెరోగట్టునాపడి— కొట్టుకొంటున్నారు మొగుడంటే పెళ్ళాం మండిపడుతోంది. అంతకన్నా భగ్గుమంటున్నాడు పెళ్ళాంఅంటే మొగుడు. తుదకెలా పరిణమిస్తుందో భగవంతునికెఱుక.

——

3

'బలరామ్—కాయా—పండా?'

'పఖడగామగ్గినపండేనండి'

'ఐతే—నువ్వుగామగాడివి?—'

'నాదేముందండి—దేవుడుదయ'

'అయితే భోంచెయ్యి—'

'అయిపోయిందండి'

'ఎక్కడ'

'విక్టోరియావిలాస్‌లో'

'ప్రజ్ఞంటేనీదోయి బలరామ్'

'అక్కడ మనమేంవ్యవహారంచేసినా సాగవలసిందే'

'అంతపక్కా- ఇన్ఫ్లూయన్సుందా?'

'లేకపోతే ఏమగాడీవ్యవహారం సాధించగలుగుతాడు'

'అబ్బా! అంతగడవగొయ్యేం'

'అమ్మో! ప్లానులువేసివేసి తన్నాగొట్టించానుగాని లేకపోతే మనిషి అయిపు మచ్చాలేకండాపోవలసిందే'

'ఏంజరిగిందేవిటి?'

'చాలగొడవుంది. చెప్తాలెండి. అమ్మగారెక్కడ?'

'ఆవిడ చెప్పకండావెళ్ళావని ఒకటేఅల్లరి'

'నేచెప్పలేదండి'

'నువ్వు చాలాజాగ్రత్తగావుండాలి—నువ్వు గింజంత జారకూడదు'

'నాకు తెలియదండీ ఆమాత్రం'

'అదికాదులే—చాలావరకు వెళ్ళింది వ్యవహారం'

'ఎందుకండి'

'తనతో చెప్పకుండా వెళ్ళినందుకు—నాతో చెప్పి వెళ్ళినందుకు'

'అంతవరకయిందా'

'నువ్వేమో చుట్టాల్నిచూడ్డాని కెళ్ళావనిజెప్పాను'

'ఏవన్నారండి'

'అయితేమాత్రం— నాఆజ్ఞలేందే ఎందుకుపంపాలి—అయిసాం-పయిసాం—అనిగల్లంతు—ఎలాసర్దుబాటుచేసుకుంటావో— జాగ్రత్త—మనం బయులుదేరి బ్రాడ్వేకిపోవాలి— తొందరగా పై కెళ్ళిచూట్లాడిరా.

అంటూ రామప్రసాద్ మీసంమీదచెయ్యేసి సాపుగాదువ్వుతూ దర్జాగా తనగదిలోకెళ్ళాడు టాయిలెట్ కావడానికి.

* * * * * *

బలరామ్ అమ్మగారూ! అమ్మగారూ! అని పిలుస్తూ మేడగది తలుపుతట్టాడు. బాలాంబ తనగదిలో కూచుని ఉబుసుపోకకు పుస్తకం చదువుకుంటూంది— బలరామ్ మాట ఆనవాలుకట్టి చటాలున చదివే పుస్తకం మూసేసి తలుపు తెరచింది. బలరామ్ ఆమెకెనంగినిలబడ్డాడు—

'ఏమోయి—బ్రహ్మకి చెప్పకుండాపోయావే'

'చెపదామనుకుంటూనే వెళ్ళానండి తొందరగా'

'వెళ్ళినపనులన్నీ చక్కబెట్టుకొచ్చావా?'

'ఇంతలో వెళ్ళక్కర్లేదండి'

'అప్పుడూ ఇలాగేచెప్పావు — నాకెవ్వరూలేరు— మనకోసం ఎదురుచూచేవారన్నావు'

'ఓవ్యవహారం మీాదెళ్ళానండి'

'ఏమిటది?'

'నింపాదిమీాద చెపతానండి'

'ఇప్పుడేం తొందరవచ్చింది—తిండితిన్నావా'

'ఆకలేసిబండిదిగ్గానే హోటల్లో తినేవచ్చానండి'

'నాతోచెప్పకుండా—ఎన్నెవరెళ్ళమన్నారు?'

'అందుకేగదండీ వచ్చిరావడంతోటే చెప్పకుందామని వచ్చాను'

'నీకిదేచెప్పడం—నేచెప్పందే నువ్వెక్కడికీ కదలడానికిపీల్లేదు'

'అలాగేనండి—ఇయ్యాలకిమాత్రం ఒదిలిపెట్టండి- అయ్యగారితో వెళ్ళాలి'

'అయ్యగారితోవెళ్లాలీ-అయ్యగారితోవెళ్ళు- అయ్యగారితో వుండు'

అందికోపంగా — కోప్పడకండి — నేనెందుకు చెపుతున్నానో — నామాటమీద విశ్వాసంవుంచి- ఈరోజుకొదలండి అన్నాడుబలరామ్.

'నాకావనేవిటో చెప్పకూడదా?'

'మీరు చెప్పకుండా నేనుండగలనా?'

'అలాఅయితే చెప్పు'

'మీరల్లా పట్టుబట్టకండిప్పుడు — అంతా సావకాశంగా చెప్తాను'

'నువ్వయ్యగారితో తిరగడానికి నేనొప్పుకోను'

'మీరొద్దంటే నేనిడ్తానా? — ఈరోజుతప్పదు'

అనేసరికి యిందేదో రహస్యంవుంది- బలరామ్ నాకుచెప్పకుండా వుండడని ఆలోచించి- నువ్వింతగా అడుగుతున్నావు కనక ఈరోజుకొదులున్నా. నువ్వుతిరిగి సాయంకాలం ఆరుకాకుండా రావాలి. ఎందుకొదుల్తున్నానో ఆలోచించుకో అని బలరామ్‌ను బయటకుపంపి తలుపేసుకుని తనపడగ్గదిలోకెళ్ళి పడుకొని చదవడానికి పుస్తకంతెరచింది.

కాని ఆమెకు బలరామ్‌మాటల్లోని రహస్యాన్నెలాగయినా కనుక్కుందామని ఆరాటంపుట్టి ఆలోచన్లోపడింది. తనమొగుడు బలరామ్ కలిసి యేదేనా నిగూఢకార్యం చేస్తున్నారా? — అదితనవిషయంలో కాదుగదా! ఒకప్పుడు నాప్రాణాన్ని కాపాడి నాచెప్పుచేతల్లోవుండి- నాఆటవపాత్రంగా చూచుకుంటూన్న బలరామ్ నావిషయంలో ఏదేనా కుట్ర చేస్తున్నాడంటే నామనసొప్పుకోడంలేదు. నాభర్త చేసినా తెలిస్తే దాన్ని సహించడనికూడా నానమ్మకం—

అదీకాక యింతతొందరగా రాజమండ్రీ యెందుకెళ్ళాడు? వచ్చి చెప్తానన్నాడుగా— తొందరెందుకూ! అని యెంతసరిపెట్టుకున్నా మనసుకు నిబ్బరం కలగడంలేదు. ఆమెకుభర్తంటే సర్వాసహ్యంవేశింది. అతడంటే వొగ్గిపరక్కున్నా కనికష్టం— పైగా మంచి వడివయసులోవున్న ఆమె పురుషసంపర్కంలేకుండా ఎంతకాలంవుంటుంది— ఆమెకేంలోటని

దేవుడలా చెయ్యాలా ఆ విషయంలో— బలరామ్ వచ్చినదగ్గర్నించి వాడి వేషం— ఆ క్రాఫ్—ఆ చురుకైన నడక—. ఆ బొమ్మ ముడిపాటు— ఆమె నెన్నో విధాలాకర్షించి మనసును కలత పెట్టేసి—ఆశా సముద్రంలోకి తోస్తున్నాయి.

ఇప్పుడది మరింత బలపడింది — భర్తకీ— తనకీ బెడిసికొట్టింది. పగలేదో ఊసిపోయినా— పొద్దుకూకేసరికి—అటు ఎలక్ట్రిక్ దీపకాంతి ఇటు చంద్రికాంతి కలసి ఆమెను నలిపేస్తున్నాయి. నా కీవంటరిజీవితం కర్మమేమిటి? కాలం ఎలాగా తగలబడిం దాపాడు పీనుగు మూలాని. వాడి ముఖం చూడ్డం సర్వకల్ల— ఇహ చేసేదేమిటి? ఎవరితో ఆలోచించను? ఇదొకరితో ఆలోచించవలసింది కాదు___అని గుంజాటన పడుతూ—తుదకు ఓ నిశ్చయానికివచ్చినట్టు నిట్టూర్పు విడిచి మంచంమీద వ్రాలింది. శరీరం మీద బట్ట పూర్తిగా వుందో లేదో ఆమెకు తెలియదు? మైమరచి మాత్రం నిద్రపోయింది.

'బలరామ్___కారు స్టార్టు చెయ్యమను డ్రైవర్ని?'

'రాలేదండింకా'

'అయితే షెడ్డులోంచి కదిలించుకు రాగలవా?'

'బ్రహ్మవిద్యా! తేగలను— అని షెడ్ తలుపు తెరచి తోసుకొచ్చి గుమ్మంలో నిలబెట్టాడు. రామప్రసాద్ డ్రైవరై కారు నడుపుతూంటే బలరామ్ లోపల కూర్చున్నాడు. ప్రసాద్ కారు స్టార్టు చేసి విక్టోరియా లంచిహోమ్‌కి పోనిచ్చాడు పదినిమిషాల్లో— ఇద్దరూ కారుదిగి స్పెషల్ రూమ్ లో కాఫీ తీసుకుంటున్నారు. ప్రసాద్—

'బలరామ్___మనకిఛాన్సు తగిలినట్టేనా?'

'తగిలినట్టేగాని మీరు తొందరపడబోకండి- నే చెప్పినట్లు చెయ్యండి'

'ఓ! అలాగే చేస్తాను గాని యెక్కడ పెట్టావు'

'లవ్ స్ట్రీట్లో స్పెషల్ పోర్షన్లో వుంచాను'

'ఆమెన్నీ చూశావా?'

'నాకు చెప్పాలా?'

'సంగతేమిటి—ఎలా ప్లాను వేసి కొట్టుకొచ్చావు?'

'చాలా ట్రబులయింది— అక్కడ నాకు భూషణం అనే బండివాడు చెప్పుచేతల్లో మనిషి. వాణ్ణి బాగా మేపేను. నేను ఫుల్ డ్రెస్సులో వెళ్ళాను. ఆమె భర్త పబ్లిక్ ప్రాసిక్యూటరు—పెద్దలాయరు—అయితేం ఆయనకి 60— ఈమెకి 20— కాలేజీకుర్రాడితో లేచొచ్చిందని మనంవిన్నమాట కొంత వరకు నిజం—ఆకుర్రాడు బెదిరిపోయి బేజారై జారిపోయాట్ట. అంచేత మళ్ళీ యింటిదోవపట్టింది మనం వెంటతరిమాం—ఆయనలేకుండా నింపాదిగా మాటకలిపాను. నేనో జమిందారుగారిదగ్గిర నౌకర్నని—వారు మిమ్మల్ని ఫలానాచోట చూసి- మీసంగతంతా తెలుసుకొని పంపారని- నవమన్మధులని- యింకా ఏవేవో కోశాను. తిప్పలాటపెట్టింది- నచ్చజెప్పాను- కొంతకాలమైనా మీరు ఆమెసొమ్ము కాశపడకుండా సమర్థించుకు రావాలి. భర్తవల్ల నాకేమీభయంలేదుగాని- ఆయన సరిగాచూస్తాడా అని, ఏవేవో ఏకరవుపెట్టింది. నేనంతకన్నా వెయ్యిరెట్లు వరాలిచ్చి మొన్నరాత్రి మెయిలుకొచ్చి బెజవాడలో ఆగాం- నిన్నగ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్సులో నెల్లూర్లోదిగాం- ఇవ్వేళ కొట్టుకొచ్చాం- మీరుమచ్చిక చేసుకోవడంలో నేర్పుచూపాలి—

అని చెప్పేసరికి లంచి ఆఖరయ్యింది. ఆ అమ్మాయివున్న రూములో మందు బలరామ్ అమగెట్టాడు. తర్వాత రామప్రసాద్ పాదం మోపాడు. కాస్సేపు కులాసాగా మాటలాడింతర్వాత నెల్లాళ్ళవరకు అక్కడేవుండేటట్లు ఏర్పాటుచేసాడు బలరామ్. ముందుగానే చెప్పాడు మీరు వారంరోజులుదాకా బయటికిరావద్దని—నేను రేపేవెళ్తానని చెప్పి అయిదు కొట్టాపడికి బయలుదేరి యింటికి పోయాడు బలరామ్.

ఆవిక్టోరియా లంచిహోమ్ అప్‌స్టెయిరులో వారిద్దరూ కిందా

మీదాపడుతూ వంకాలక్షేపం చేస్తున్నారో—మనకిప్పుడెందుకూ! బల రామ్ ఉడాయించినట్లుగానే మనమూను—

— —

౪

‘బలరామ్ భోజనందగ్గర అంతతొందరెందుకూ?’

‘నాకలవాటది’

‘నీకలవాటు లేందేవిటి?’

‘మీదయవల్ల అన్నీ’

‘కొంచెం కూటు వేసేదా?’

‘ఒద్దు’

‘తైరు పొయ్యమన్నావా— రసం వేసుకుంటావా?’

‘రసం నీరసంచేస్తుంది’

‘తైరు తత్వంఫిరాయించదూ?’

‘వెయ్యండి’

అంటే బాలాంబ గడ్డలాంటిపెరుగు వెండికంచంలో దిమ్మరించిం ది. బలరామ్ ఇదివరకు ఆకులోనే తినేవాడు. ఇవ్వేళ బాలాంబే లోపలి గదిలో వడ్డించి — దగ్గరగా కూచుని— అది కావాలా- ఇది కావాలా అని ఆప్యాయంగా అడుగుతోంది. మధ్య మధ్య వంగి— పైటచెంగు వయ్యారంగా జారవిడుస్తూ— బలరామ్ గ్రాఫ్ మడతలు ఆమెగజ్జెలవడ్డా ణం మెఱుపుల్లో ప్రతిఫలిస్తూంటే— దానికేసి ఓమాటూ— అతనికళ్ళల్లో కి ఓమాటూ— వంగి చూస్తూంది. అలాంటిసమయంలో చటాలున బల రామ్ యెందుకో పకాల్న నవ్వాడు— బాలాంబకూడా పైట సరిచేసు కుంటూ నవ్వింది.

ఎన్నాళ్ళనుంచో వారిద్దరి హృదయకుహరాలలో అణగి మణగి యున్న కోరిక లివ్వేళ పైకి బుడగలేస్తున్నాయి— బలరామ్ భోజనమైంది. బాలాంబకూడా భోజనం ముగించుకుని వచ్చింది. ఇద్దరూ మేడమీద చలవపందిట్లోకొచ్చి నిలబడ్డారు. బలరామ్ సిగరెట్టు ముట్టించి పీలుస్తూ ఆకాశమంతా పొగతో నింపేస్తున్నాడు. ఆసమయంలో బాలాంబ యేమీ తెలుసుకోకుండా—

'ఆయనేడీ?'

'ఇంటికిరాలేదు—కొంతకాలందాకా రాడు'

'ఏమిటి విశేషం?'

'విశేషమే—గొప్పవిశేషం'

'వింటాను చెబుదూ?'

'చెప్పితీరాలి'

'ఊరించక చెప్పు'

'వినడానికి మీరెంత తొందరపడుతున్నారో చెప్పడానికి నాకూ అంత తొందరగా వుంది'

'అంతగొప్పవిశేషమా?'

'మనకి'

'అయితే నువ్వు రాజమండ్రీ యెందు కెళ్ళావో ఆనక చెపతా నన్నావ్'

'అంతా చెబుతున్నా వినండి— దాపరికం చేస్తే మోసగాణ్ణయి పోతాను—

ప్రసాద్‌గారే నన్ను రాజమండ్రీ అర్జంటుగాపంపారు. వెంకంగారు పడవన్దు. నెల్లాళ్ళకింద టీవ్వూరు గాజమండ్రినుంచి ఓపో కేళాపిల్లొచ్చింది. ఈయన దానికి వలొగ్గి యెంతేనా ట్రియిచేసారు. లాభంలేకపోయింది. పిట్ట మళ్ళీ గూటి కెగిరిపోయింది. ఆగూట్లోంచి నెట్టుకురమ్మని నన్నం

పారు. యజమానికార్యం అని కాకపోయినా— ఏదో ఆసమీద అనేక చిక్కుల్లోస్తే నెట్టేసి వ్యవహారం సాధించుకొచ్చాను—

'అదా సంగతి— తలబిరుసుకి మూలకారణం- పైనికానియ్యి-

'విక్టోరియాలాంచిహోమ్‌లో మకాం— ఇద్దర్నీ కలిపాను— మీ మాట ప్రకారం టయిముకి హాజరయ్యాను.

' బలరామ్— నువ్విలాంటి పనిచెయ్యొచ్చునా?'

'కూడదని తెలిసుండేచేశాను'

'అలాయెందుకుచెయ్యాలి'

'ఏమిటో— చేసేశాను— ఏమన్నా సరే'

'నీవేదో మనస్సులో పెట్టుకొని అలాంటిపని చేసుండాలి'

'ఏదో— వుంది— లేకపోలేదు'

'అదేమిటో చెప్పు'

'.....................'

'కూకలెయ్యరుగదా?'

'కూడదనిపస్తే నేను— నువ్వలాంటి పనిజేస్తానా?'

'కూడందే- కూడాలని ఆశతో—

అని నీళ్ళునములుతాడు. బాలాంబ కొంచెంగ్రహించినా— పైకి తెలియనీకుండా ఇంకా లోతుకుపోతోంది. ఇంతట్లో బలరామ్ పెద్ద ఆవులింతచేసాడు- నిద్రొస్తోంటే పోదాంపద పైకి- అంటూ బాలాంబ తాను ముందు నడుస్తూంది, వెనకాలే బలరామ్ వెళుతున్నాడు.

బలరామ్ మామూలుగా పడుకునే గదికిందుంది. అక్కడికెళ్ళే వాడిమోస్తరుగా నటించాడు. ఇవ్వేళ పైనేపడక- నాకుసాయంగా— అనంటూ తనపడ్కగది దగ్గిరికి తీసికెళ్ళింది. ఆమంచంమీద నువ్వు- దీనిమీద నేను- పడుకో అంది- మాట్లాడకుండా నడుంవాల్చాడు బలరామ్. అతనిమంచానికి మూడుగజాల దూరంలో బాలాంబపడుకుంది.

వాళ్ళిద్దరూ పడుకున్నారేగాని ఏ ఒక్కరికీ నిద్రపట్టలేదు. బలరామ్ తనపక్కమీద పక్కవాటుగా పరున్నాడు. బాలాంబ ముఖం ఆకాశంవంక పెట్టి దీర్ఘాలోచనలో మునిగితేల్తూంది. రామప్రసాద్ సంగతియింతకొచ్చింది నాజీవితాన్నంతనీ మంటిపాలుజేసాడు దురాత్ముడు. చిన్నప్పటినుంచీ చెడుతిరుగుళ్ళు తిరిగేమనిషి కుదుటపడడం కష్టం. అతడికీనాకూ నేటివాదనతోనే సంబంధం తెగిపోయింది. అయితే లోకులు కాకులు. అంచేత ఏవోఅంటారు. వాటిని లెక్కచేసి నాజీవితాన్ని అధోగతిచేసుకోనా? లేక యీబలరామ్ నా చెప్పుచేతల్లో ఉన్నమనిషి. ఒకప్పుడు నాప్రాణదాత. చీటికీ మాటికీ ఉడాయించేవాడుకాడు. ఇతడితో సంబంధంకలిపి నావాణ్ణిగా చేసుకొని జీవితాన్ని ఆనందంగా గడపనా? ఏదోయొక తెగతెంపుకురావాలి. ఆప్రసాద్ నాగుమ్మం తొక్కొస్తే గెంటేస్తాను. బలరామ్ చెప్పిందాన్నిబట్టి అతడేదో పెడదోవ నిశ్చయించుకొనే నాకెదురుతిరిగాడనుకోవాలి.

అని ఊహాతరంగాల్లో మునకలేస్తూ తటాలున లేచి కూచుంది. బలరామ్ బాగా జాగ్రదవస్థలోనేవున్నాడు. బాలాంబ బలరామ్ అని పిలిచి నిద్దరట్టడంలేదా అని అడిగింది.

'ఎలాపడుతుంది?'

'అటు తోటవేపు పోదాంపద'

'ఎందుకు'

'మల్లెపందిరక్రింద కూచుందాం'

'సరే'

'నాకూ నిద్రట్టలేదు'

'ఎలాపడుతుంది'

'బాగాగుమాయింపేస్తోంది'

'గుమాయింపేమిటి—ఒళ్ళంతా కసపిసలయ్యింది'

'అక్కడ మంచిగాలేస్తుంది'

'వేస్తే గాలిక్కాశా వేస్తుంది'

'అక్కడకూచుని కబుర్లు చెప్పాగుందాం'

అని బాలాంబలేచి బలరామ్ లేవడానికి చెయ్యాసరాయిచ్చింది. లేచి యిద్దరూ తోటవైపు వెళ్ళారు! మల్లెపందిరికిందకూర్చుని యిష్టాగోష్టి వేశారు. బలరామ్ గుండెలు తటతటా కొట్టుకొంటూంటే కూచున్నాడు.

'బాలాంబే ముందుగా మనసు కదుటబరమకొని బలరామ్‌కు దగ్గరగా జరిగి కూర్చుని కులాసాగా చలాకీగా చెప్పడం ప్రారంభించింది యీవిధంగా—

'నువ్వు రాజమండ్రీ వదిలొచ్చి సుమారు ఎంతకాలమయిందో చెప్పగలవా?'

'ఏడాదికావస్తోంది'

'ఇక్కడ నీకు హాయిగా వుందా'

'ఆహా! నాకెంతో సుఖంగావుంది కాని_'

'ఆగావేం చెప్పు'

'చెప్పడాని కేవుంది— ఒంటరిజీవితం గడపలేకుండా వున్నానం చేతో అంతే'

'అదేకదూ యిక్కడ నీకున్నకష్టం?'

'జౌను'

'నువ్వు నాపాలిపకంలో వున్నావు గనుక నీవంటరితనం పొదల గొట్టుబాధ్యత నామీదే వుంది'

'నేను ఎప్పుడూ నీవాణ్నే'

'అసంగతి నాకు తెలుసు. పిల్లనోదాన్ని చూసి నీకు ముడెట్టడానికి చూస్తున్నాను'

'నాబోటివాడికి పిల్లనెవరిస్తారు?'

'ఎవరిస్తారేమిటి?'

'ఎందుకివ్వరూ? నీకే తక్కువ అందానికాతీసిపోవు ఏదో తెచ్చుకుంటున్నావు పెళ్ళాన్ని పోషించగలవు'

'నీకేలాతోస్తే అలా చెయ్యి'

'నీయిష్టం ఎలాగో అలాగే చేస్తాను'

'నావంటిపిల్లను చూడమన్నావా?'

'ఎగిరిగంతేస్తాను'

'దాన్ని ఏంజేస్తావు?'

'నెత్తినెట్టుకుంటాను'

'నెత్తినెట్టుకుంటే తొక్కుతుందేమో?'

'ఏంజేసినాసరే'

'పోనీ నన్నే చేసుకుంటావా అంటూ విరగబడినవ్వింది'

'అంతదృష్టమా యీబలరామ్‌కి'

'అదృష్టంపడితే కాలదన్నవుగదా?'

'ఎప్పుడూ అపంజెయ్యను'

'అయితే నేచెప్పినట్టు చేస్తావా?'

'తప్పకుండా'

'నన్ను చేసుకో—'

అంటూ అతనిక్రాప్ చేత్తోసవరిస్తూ— బలరామ్ నీదగ్గిర దాచటమెందుకు-నన్ను కట్టుకున్న భర్త దగాచేసి నీచంగా చూడడం మొదలుపెట్టిన దగ్గిరనుంచీ నామనస్సు నీమీదనిలబడింది. చాలాకాలం ఓరిమిపట్టాను. ఇకపట్టలేను. అతడితో సంబంధం పూర్తిగా తెంచేశాను నిన్నటితో-ఇకనుంచి నన్ను నీదాన్నిగా చేసుకుని నాతో నేవుంటే నీఒంటరితనం వదలిపోతుంది నిన్ను దేవుడుగాయెంచుకుంటూ నీదాన్ని అవుతాను. మనమిద్దరం

హాయిగావుండాము. అని బలరామ్ ముఖం పైకెత్తి తనచేత్తో పట్టుకొని అతనికళ్ళల్లోకిచూస్తూ నెమ్మదిగా అతనివక్షంమీద వాలింది.

ఈహఠాత్తుగాలభించిన ఆకాశసౌధం ఎంతకాలంవుంటుందీ అని ఆలోచిస్తూనేబలరామ్ బాలాంబను రెండుచేతూలూ పెనవేసి దగ్గిరగా లాక్కున్నాడు. ఆవిధంగా యెంతకాలం మల్లెపందిరికిందవున్నారోగాని తెల్లవారేముందుమాత్రమూయిద్దరూ బాలాంబ పడకగదిలోనేఉన్నారు.

అదృష్టమంటే బలరామ్‌దే. నవయువ్వనంలోవున్న బాలాంబ కొన్నిలక్షలకధికారిణియైన విలాసవతి ఎక్కడో కార్లదగ్గిర బోర్కరుగావుండి పొట్టపోసుకునేవాణ్ని మనసారావలచి తనవాణ్ని చేసుకుందంటే అదెంతదృష్టమోచూడండి. ఇప్పుడు బాలాంబే బలరామ్. బలరామే బాలాంబ. వాళ్ళిద్దరికీ ఏమీఅరమరికలేదు. ఒక్కచోటే కాఫీఫలహారాలు, భోజనం, పడక, విహారాలు.

అయితే బాలాంబ యీవిషయంలో ఏమీరహస్యంగా ప్రవర్తించడంలేదు. బహిరంగంగానే బలరామ్‌ని తన్నువలచి చేరదీసినట్టుగా సంచరిస్తోంది. ఈ సంగతిచూసినవారికందరికీ విడ్డూరంగా కనిపిస్తూంది. బాలాంబకీ భర్తకీ మధ్యనున్న అగాధనరకకూపమైన ప్రణయవిషాదగాధ తెలియదుకాబట్టి.

లోకం ఏమనుకున్నాసరే, బాలాంబకుమాత్రం బలరామిప్పుడు ఓదేవుడు. అతడిప్పుడు నౌకరుగాడు. ఆయింటికి యజమానే.



X

'ఇవేళ ఏబీచికిపోదాం'

'మీయిష్టంగాని ఈబట్టలతో మాత్రం నేను బీచికిరాను'

'నాజావిళొందాంతే'

'నాదగ్గర పైసాఅంతాఅయిపోయింది'

'నేనంతదరిద్రుణ్ణనుకున్నావా?'

'అలా నేననలేదు'

'మరి పెందరాళే వెళదాం బయలుదేరు'

'దేనిమీద?'

'రిక్షాలో పోదాం'

'కారేమయింది'

'రిపేర్లో వుంది'

'కాదు— అదిమీదికాదుగా?'

'ఎవరన్నారు?'

'ఒకరనేదేమిటి? దానిమీద రాజమండ్రి నాకోసంవచ్చినమనిషీ ఇంకో స్త్రీ షికార్లుకొడుతున్నారు. నేను కళ్ళారాచూసాను'

'అయితే వాడు రిపేరుచేసేచోటునుంచితీసుకుపోయాడేమో?'

'అదంతా నాకు తెలియదు'

'రిక్షామీద పోదాంనడుద్దూ—'

అంటూ రామప్రసాద్ తనజేబులో ఆఖరుచెక్కు మార్చగా మిగిలిన మూడువందలతోను మూడుచీర్లు కొనితెచ్చాడు. నిజానికి భవానిదగ్గర డబ్బులేకపోలేదు. వుందింకా రెండువేలు. కొన్నివస్తువులు కూడావుంటే పెట్టెలోదాచేసింది. ప్రసాదునుగురించి ఆమెకు చూచాయగా కొంతకొంత తెలియడంవల్ల ఆమె జాగ్రత్తలో ఆమెవుంది.

ఇద్దరూ ఒకేరిక్షాలో బయలుదేరి టిప్లికేన్‌బీచికి వెళ్ళారు. అక్కడోగంట గడిపి అక్కణ్నుంచి స్టార్‌పిచ్చర్‌పేలసుకు సినీమాకి వెళ్ళారు. అదేహాలుకు బాలాంబా బలరామ్‌లు వచ్చారు. ప్రసాద్ వాళ్ళిద్దరినీ రిజర్వ్‌క్లాసులో చూసాడు. వాళ్ళుమాత్రం వీరినిచూళ్ళేదు.

బలరామ్ యింక సినీమా ఆఖరవుందనగా కనిపెట్టి బాలాంబకు చూపాడు. భవానికిమాత్రం ఇదేమీ తెలియదు. ప్రసాద్ వాళ్ళనిచూసిందగ్గర నుంచీ అదోమోస్తరుగావున్నాడు. భవానిని యింటికిపోదామని తొందర పెట్టాడు. ముందుగా భవానీ ప్రసాదులే హాలునుంచి వెళ్ళిపోయారు.

తరవాత బాలాంబా బలరామ్‌లు సినీమాహాలునుంచి బయలు దేరి వీళ్ళముందర్నుంచే కారులో వెళ్ళిపోయారు. భవానిచూసి అదుగో అదిగో మనకారు అని కేకవేసి ప్రసాదుకు చూపింది. రాత్రి ఏదో కులాసాగా గడిపారు. ప్రొద్దుట్నుంచీ భవానేదో ఆలోచనలోపడి కొట్టు కుంటోంది. ప్రసాద్‌చేతిలో కాసీలేక కొట్టుకుంటూ ఊళ్ళోకిపోయి మధ్యాహ్నం మామూలుటయమ్‌కంటె ఓగంట ముందుగావచ్చాడు.

అప్పటికి భవాని యెవరితోనో లాడ్జిలో మాట్లాడుతోంది వీధి తలుపు లోపలవేసుకొని. ప్రసాద్‌వెళ్ళి తలుపుతట్టాడు. అతడికి ఏస్నే హితుణ్ణడిగినా ఏగాణి అప్పుపుట్టలేదు. దానిచేత కల్లుతాగిన కోతిలా అయిపోయివచ్చాడు లాడ్జికి. దానికితగినట్టుగా భవాని తలుపుమూసేసు కొని యెవరితోనో మాట్లాడుతోంది. బయటనుంచిచూసాడు. మరిగా తందనాలు తొక్కడం మొదలెట్టాడు.

భవాని ప్రసాద్ ఇప్పుడప్పుడే రాడనుకొని మదరాసులోవున్న ఓఫిలింకంపెనీలోని డైరక్టరుతో మాటాడుతోంది. ప్రసాద్ తలుపుతట్ట గానే లోపలివాళ్ళిద్దరూ ఖంగారుపడ్డారు. భవాని ఆడైరక్టరికి ధైర్యం చెప్పి మారుతోత్రోవనివంపేసింది. ప్రసాద్ ఎంతకీ వీధితలుపు తియ్యబడక పోతే– దొడ్డితోత్రోవనబడ్డాడు. అప్పుడే ఆడైరక్టరు దొడ్డిగుమ్మందాటి రెండుగజాలు ఎడముఖంగామళ్ళాడు. అతను తమలాడ్జిలోనుంచే వెడు తూన్నట్టు ప్రసాద్ నిశ్చయించుకొని తిరిగివచ్చి భవాని తలుపుతియ్యగా లాడ్జిలోకెళ్ళాడు.

తనదుస్తులువిప్పి కిందామీదా విరజిమ్మాడు. కారియర్ విప్పకో డానికూర్చుని దాన్ని క్రిందామీదా దొర్లించాడు. అందులోవున్నవన్నీ క్రిందపడిపోయాయి. భవాని విస్తుపోయి చూస్తోంది.

కారియర్ సరిచేసి ఆకులో అన్నం పెట్టబోయింది. ప్రసాద్ మండిపడుతూ—

'నేపెట్టుకుంటాలే'

'అలావున్నారేమిటివ్వేళ?'

'ఎందుకుండరు—'

'అంటే'

'నువ్వెంతసేపటికీ తలుపుతియ్యలేదెంచేత?'

'ఇట్టేపడుకుంటే కునుకుపట్టింది'

'అబద్ధమెందుకూ— లోపలినుంచి నాకు మాటలు వినిపించాయి'

'ఇక్కడెవరితో నేను మాట్లాడతాను'

'ఇటువంటిదానవని తెలుసుకోలేకపోయాను'

'అలాకోపంగా మాట్లాడుతున్నారేమి?"

'మాట్లాడరు—నువ్వాడేనాటకానికి'

'నాకేం బోధపడ్డంలేదు—అదేదో విప్పిచెప్పి అడగండి'

'అడిగేదేమిటి—నాకళ్ళతో చూసిందాన్ని లేదంటున్నావు?'

'మీరేంజూశారు?'

'ఆమనిషి దొడ్డిగుమ్మాన్నుంచి వెళ్ళిపోవడం'

'రామరామ! మీరుచాలా పొరబడుతున్నారు'

'నిజంచెప్పెయ్యి—మీవూరునుంచెవరేనా వచ్చారా?'

'ఏదీలేదండి'

'అదే అనద్దన్నాను—దొడ్డితలుపుతీసి పంపించావు'

'లేదు మొఱ్ఱో అంటే మీరు నమ్మరాయె—పోనీ ఆవెళ్ళేమనిషిని

ఈలోపల్నుంచి ఎందుకొస్తున్నావనడిగితే తేలిపోనుగా'

'అదే పొరబాటుచేశాను'

'నిజంగా పొరబాటే—అప్పుడు నిజమూ తెలుసును—నిష్ఠూరాలూ ఉండకపోను'

'నేను ఈలాడ్జి—మీరుతప్ప యింకేమైనా నాకు పరిచయమైందా యిక్కడ. ఎక్కడికెళ్ళినా యిద్దరంపోతున్నాం—వస్తున్నాం—

అనేసరికి ప్రసాద్ కొంత సర్దిపెట్టుకొని భోజనం ముగించాడు. ఆమె మూతిముడుచుకొనికూచుంటే వెళ్ళి బ్రతిమాలాడు—ఏదో భ్రాంతి పడ్డానుగాబోలని క్షమాపణ చెప్పుకొన్నాడు. లేచి రెండు మెతుకులు కొరికిందేగాని—ఓకులాసా లేదు—ముచ్చట లేదు—ఓ కుర్చీలో ప్రసాద్ కూచుంటే మరోకుర్చీలో భవానిముఖం ముడుచుకొని ప్రక్కకు పెట్టి అదోలావుంది. ప్రసాద్ మనసేదో అనడంవల్ల దిగాలుపడి పోయిందనుకుంటున్నాడు.

భవానిమాత్రం ఆలోచనలోపడింది మోసపోయానని— ఆ వచ్చిన డైరక్టరు ప్రసాద్ సంగతంతా తెలుసుకుని—ప్రసాద్ కి పెళ్ళాడిన భార్యవుందనీ, ఆమె చాలాడబ్బుకలదనీ, వీడుచేతుల్లో ఎర్రనిఏగాణి లేనివాడనీ—భార్యవల్ల తిరస్కరింపబడి నిన్ను మోసంచేసి తీసుకొచ్చి నీపాలిబడ్డాడనీ—నావుముందుముందు తిండికీ గుడ్డకీగూడా చిక్కుపడతావనీ—పెందరాళే మేలుకోమనీ, తన ప్రాపకంలోవుంటే నెత్తినబెట్టుకుంటానని నచ్చచెప్పాడు.

అందుచేత మొగుణ్ణివదిలేసి రానేవచ్చాం—బరితెగి వీధినిబడదామా. లేకపోతే యింకొంతకాలంచూతామా—ఇప్పటికే డబ్బుకు ఇబ్బంది పడుతూనట్లు సూచనలగుపిస్తున్నాయి. కిక్కురుమనకుండా డైరెక్టరుతో పోదామా అని ఆలోచిస్తోంది.

ప్రసాద్ కి మాత్రం డబ్బెక్కడాబదులువుట్టలేదు. బ్యాంకిలో డబ్బంతా అయిపోయింది. బాలాంబదగ్గిరికెళ్ళి అడగాలనుకుంటున్నాడు.

వెడితే రంకుబయలవుతుందేమోనని చూస్తున్నాడు బలరామ్ మళ్ళీ అత నిక్కనపడలేదు. బాలాంబ వెళ్ళద్దని కట్టడిచేసుకుందని సరిపెట్టుకున్నాడు. డబ్బేమీ లేకపోవడంచేత కరాకుచిరాకుగాను వుంది. ఎందుకైనా సరే—ఏవైనా సరే—బాలాంబనడుగుదామని బయలుదేరాడు.

ప్రసాద్ తిన్నగా రిక్షాలో బయలుదేరి యింటికెళ్ళాడు. అల్లంత దూరానే నౌకరు చూచి ముందుగానే బాలాంబతో అయ్యగారొస్తున్నారని చెప్పాడు.

'అయ్యగారెవరా?'

'రామప్రసాద్ బాబుగారు'

'రానియ్యి—అవతలగ్గెంటేస్తాను'

'నిజంగానే వస్తున్నారండి'

'నువ్వెళ్ళి వీధిగేట్లో నిలబడి—లోపలికి రావద్దన్నారని చెప్పు'

'ఎవరన్నారంటే'

'నేనన్నానని చెప్పు'

'తంతారేమో?'

'నిన్ను తన్నడానికతని కేమధికారంవుంది'

'ఏమోనండి—బలరామ్‌నుకూడా పంపండి'

'బలరామ్ నిద్రపోతున్నాడు—రాడు'

'ఇద్దరంనౌకర్లమే కదండీ?'

'పళ్ళురాల్తాయి బలరామ్‌ని నౌకరంటును'

'జీతం పుచ్చుకోడంలేదండీ?'

'అవన్నీ నీకెందుకవతలకుపో'

'మీరు చెప్పినట్లే చేస్తాను—నాకేమి'

'అలా చెయ్యి'

అనగానే ఆనౌఖరు వెళ్ళి వీధిగేటుదగ్గిర నిలబడ్డాడు. ప్రసాద్ చర చర చీడీలెక్కి గేటుదాటబోతూంటే నౌఖరు మిమ్మల్ని అమ్మగారు లోపలడుగెట్టడానికి కీల్లేదన్నారని చెప్పాడు.

'ఏడిశావు—తప్పుకోవోయ్'

'మీరొస్తున్నారని చెపితే గుమ్మం ఎక్కనివ్వద్దని చెప్పారు'

'బలరామ్‌నిల్లాపిలో మాటు'

'నిద్దరోతున్నాట్ట—ఇప్పుడు లేపితే కోప్పడతాడు'

'నౌకరీవాడికి నిద్దరేవిటి?'

'బలరామ్ యిప్పుడు నౌఖరు కాదుట. యజమానేట ఈయింటికి'

'అబ్బా—అందాకావచ్చిందా?'

'ఏమోనండి—అమ్మగారన్నారు'

'అయితే నన్ను లోపలికి పోనిస్తావా—పోనియ్యవా?'

'నన్ను చంపేసి వెళ్లండి'

'అలాకాదు—ఒక్కమాటు బాలాంబను బయటకుపిలు—'

అనంటే నౌఖరు ఏంజెప్పమన్నా రన్నాడు. పిలుస్తున్నారండి ప్రసాదయ్యగారని చెప్పు అనడంతోనే నౌఖరు మేడమీదకెళ్ళి చెప్పాడు.

'ఆమె మీతో మాట్లాడదు- పొమ్మని చెప్పు- అనడంతోటే వాడలాగే చెప్పగావాణ్ణి నాలుగుతన్ని లోపలికెళ్ళాడు. మేడమెట్లెక్కాడు. బాలాంబ గదిదగ్గిరి కెళ్ళేసరికి బాలాంబ మంచంమీద పడుకున్న బలరామ్ చాతీపక్క ఓచెయ్యానుకు నిలబడి. ఏదో చెవులో చెబుతూంది. ప్రసాద్ చూచి- ఎంతకైనా తగిందే ఆడది. ఇంతసాహసమా అన్నాడు.

బాలాంబ ప్రసాదుని చూడ్డంతోటే మండిపడుతూ—

'లోపలి కెవర్రిమ్మన్నారునిన్ను—ఎందుకొచ్చావు'

'నన్నొకరు రమ్మనే దేవిటి—ఇదినాయిల్లు'

'ముందు వీధిగేటుదాటి—అవతలికిపో'

'నేను వెళ్ళను—నాయిల్లు'

'ఇక్కడ నీకేమీ లేదు—ఇప్పుడీయింటియజమాని బలరామ్'

'ఆనౌకరుగాడా?'

'ఎవడైతేం మనకిమల్లా చవటగాడు'

'నాకివ్వాలసినడబ్బేది'

'నీ మొహం—నీకోళ్ళు బాకీకూడానా?'

'ఇస్తావా—ఇయ్యవా—నాలయిదు వేలు'

'నేనేమీనీకివ్వక్కర్లేదు—ముందు మేడదిగి బయటికిపో'

'పోకపోతే యేంజేస్తావు'

'గెంటిస్తాను'

'గుంపు తెంపేస్తాను'

'లాగాడితే తెగి తప్పాలా నూతిలో పడుతుంది'

'సరి—నాకేం దర్జాగావున్నాను'

'నీయిష్టంవొచ్చినట్లుండు—అవతలికిపో'

అని ఖడాలున తలుపేసుకుంది. బలరామ్ పకపకానవ్వుతున్నాడు. ప్రసాద్ బలంకొద్దీ ఆ తలుపులు విరగతన్నుతున్నాడు. బాలాంబ తలుపు దీసి—అమ్మప్పెట్టవినాలుగు పెడితేగాని తన్నగా వెళ్ళవు. అనినౌకర్ని పిలిచింది పీకపట్టుకొని వీధిగేటుదాటించమంటే వాడంతపనీచేయడానికి సిద్ధపడ్డాడు. ప్రసాద్ కిక్కురుమనకుండా మేడదిగి తోవట్టాడు విక్టోరియాలంచిహోములోలాడ్జికి.

బాలాంబ మగాడంటేనేమాయ— నమ్మినవాళ్ళు పాడునూతిలో దూకినట్లే— తెగిన త్రాడితో గొంతుకోసుకున్నట్లే— ఛీ! జన్మత్తగానే సరా! సిగ్గూ— బిడియంవుండద్దూ—

అంటూ లోపలకెళ్ళి బలరామ్‌తో కలిసి ఫలహారం చెయ్యడం మొదలెట్టింది. వాళ్ళిద్దరూ ప్రసాద్‌ను గురించి ఏమేమో చెప్పుకున్నారు.

డబ్బులేనివాడెందుకు మారతాడు!!!

— —

3

లాడ్జితలుపు బయటగొళ్ళెం వేసుందేమో అని ప్రసాద్ గబగబా గుంజాడు. ఆ చప్పుడువిని హోటలుసర్వెంటు వచ్చాడు. ఈలాడ్జిలో వున్నామె నెవరో వచ్చి కారుమీద తీసికెళ్ళారు మీరువస్తే ఆమెకోసం వెతకద్దనీ మీసామానంతా లోపల జాగ్రత్తగావుందని చెప్పింది. మీరొస్తే తలుపుతీయడానికి నన్నిక్కడ కాపలాపెట్టాడు ప్రొప్రయిటరు గారు. అని తలుపుతీసాడు. ప్రసాద్ లోపలకెళ్ళాడు. ఆమె తాలూకు చీపురుపుల్లయినా అందులో లేదు. ప్రసాద్ తాలూకు సామాను ఎక్కడి వక్కడే ఉన్నాయి. పైగా మొన్న ప్రసాద్ కొన్న మూడుచీరలు ఇంకా ఏవో కొన్ని మూటగట్టి ఓపెట్టెమీద పెట్టున్నాయి. దానిపైన ఓచీటీ కూడావుంది. ప్రసాద్ దాన్నితీసి చదవడం మొదలెట్టాడు. అందులో—

ప్రసాద్! నువ్వు నన్ను మోసంచేయించి తెప్పించావు. నీజన్మంతా మోసపుజన్మేనని నాకు తెలిసింది. మోసగాణ్ణి మోసంచేతనే జయించాలి అంచేత నీకు గుడ్బైచెప్పాను. నాకిప్పటికి తెలిసిందేమంటే మగాడంటేనేమాయ— నమ్మినవాళ్ళు పాడునూతిలోదిగినట్టే— తెగనికత్తితో గొంతుకోసుకున్నట్లే—ఛీ! జన్మెత్తగానేసరా! సిగ్గూబిడియమూవుండాలి. నాకోసం వెతక్కు. నేనీసిటీలోనేవున్నాను. ఎప్పుడేనా కనుపిస్తాలే.

అని వుంది. అరే! అన్నివిధాలా చెడ్డాము. అటు పెళ్ళాడిన పెళ్ళాన్ని చెందనాడుకున్నాను ఇదేమోశాశ్వతమని. అక్కడికెడితే మెడ మెల్లక్కితే డొక్కచీరిస్తానంది ఇక్కడకొస్తే యిది గుడ్డిచెప్పింది. ఇప్పుడు మనగతేమిటి? లాడ్జికి మీలున్నకు యివ్వవలసినడబ్బుకు లటా యిస్తాడు హోటల్‌కీఫరు మర్యాదావుండదంటూ ఆమూటలోచీరలు వగైరాలుతీసుకొని బజారుకెళ్ళి విక్రియించగా కొంతడబ్బొచ్చింది. హోటలుబాకీ వదిలించాడు—

ఇప్పుడేంజెయ్యడమా అని ఆలోచిస్తూ ఓనాలుగుమార్గాలకూడల్లో నిలబడ్డాడు. ఏఆలోచనా పాలిపోడంలేదు. ముందుసంగతెల్లాగ? అయినా వోయెత్తు వేసిచూస్తాను బాలాంబకి.

అంటూ చరచరానడచి పోతున్నాడు. ఓపాతస్నేహితుడు పిలిచాడు. నాడిదీపం ఆర్పేద్దామని ప్రసాద్ అనుకుంటే వాడేయితన్నార్పేసి పోయాడు నిజంగా అతనిదగ్గిర ఎట్టినియోగానిలేదంటే నమ్మండి. అది లోనే అయిపోయాయి చేతినున్న రిస్టువాచీవగైరాలు—

ప్రసాద్ మరోపదిరోజులెల్లాగో గెంటాడు. ఒక్కపూటకూడా గడిచేతోవలేదు. ఎక్కడేనానౌకరీచేద్దామా అనుకున్నాడు. పువ్వులమ్మినచోటే కట్టెలమ్మడమా అని అభిమానపడ్డాడు. స్నేహితులెవరేనా కనిపించిపిలిస్తే వాళ్ళతోవెళ్ళి ఓపూటగెంటేవాడు— ఏదేనా హోటల్లో జనసమ్మర్దం బాగావున్నప్పుడుపోయి చెక్కపూటుగాతిని ఇవతలికొచ్చేసేవాడు. ఇలాగ ఓవారంగడిచేను— రెండువారాలు గడిచేను అంతేకదా?

తుదకి బాలాంబకిప్పట్లో కనిపిస్తే లాభముంటుందేమోనని వెళ్ళాడు. పురాకృతకర్మఫలం అనుభవించకతీరుతుందా? అంది.

బలరామ్ బాలాంబతో ఒక్కసారి వెళ్ళి ప్రసాద్‌తో మాట్లాడి రానా? అనడగ్గా నీకలాంటి కుతూహలం వుంటే నేనొద్దనను గాని లోపలికి మాత్రం తీసుకురావద్దని చెప్పింది.

ప్రసాద్ ఎదుట కెళ్ళాడు బలరామ్. తలదించుకున్నాడతను. అతని దైన్యస్థితంతా ఎదట గోచరించింది. మాటాడలేకపోయారొకరితో ఒకరు- బలరామే ఇలాఅయిపోయారేమిటన్నాడు. ఏంచెయ్యమన్నా వంతా అయిపోయింది. తిండికూడా లేదు నాలుగురోజుల్నించన్నాడు. బలరామ్ బాలాంబచూడకుండా పెట్టె తెరిచి వందరూపాయిలనోటొక టిచ్చాడు. అదిపుచ్చుకుని ప్రసాద్ వెళ్ళిపోయాడు.

బాలాంబని బలరామ్— బలరామ్‌ని బాలాంబ ఒక్కక్షణం వది లుండలేకుండావున్నారు- కాని బలరామ్‌మాత్రం ఎందుచేతనో అదో మోస్తరుగా కనిపిస్తున్నాడు. బాలాంబ కనిపెడుతోందిగాని సాహసించి అడగలేకపోయింది.

రెండుమాసాలు దొర్లాయి కేలండర్లో. ఒకనాడు బాలాంబ పార్థసారథిస్వామికోవెలకెళ్ళింది. బలరామ్ ఇంట్లోనేవున్నాడు- బాలాంబ తాలూకు చెక్కుబుక్కులు ఖజానాతాళాలు అతనిదగ్గరేవున్నాయి- ఇదివరకే యేభై వేలు డ్రాచెయ్యడానికి చెక్కుమీద సంతకంచేయిం చాడు మంచికలాసాటయంలో- ఇంట్లోడబ్బుందికదా యెందుకని ఆమె అడగలేదు.

ఆమె కోవెలకెళ్ళగానే బలరామ్ బ్యాంకికెళ్ళి మార్చుకొచ్చాడు చెక్కు. కాకితాలకట్టలేగనక ఓబట్టపుడతలో పెట్టి దాచాడు- తనకు గావలసిన సామానులు తన వసువునేని అన్నీ ఓస్నేహితుడు డింటికి చేర్చాడు. ఖజానాతాళంతీసి యింకోయిరవై వేలు పట్టుకున్నాడు— కాని ఓచీటీమాత్రం ఆమె తలదావ్వకు నేసామానుంచే పెట్టెలో పెట్టాడు.

మదరాసులో ఓమూలమూల మింట్ బిల్డింగ్సులో వున్నాడు బయటికి రాకుండా—

భవానినివిక్టోరియాలంటిహోమునుంచి లేవదీసుకుపోయిన ఫిలిం డైరక్టరునిజంగా ఫిలిండైరక్టరు కాడు. అతడీమెను ప్రక్కగదిలో బసగా వుండి, అక్కడివాళ్ళవల్ల సంగతంతా తెలుసుకున్నాడు. నింపాదిగా గేలం వేసాడు. తగిలిందిచేప. అతడు మద్రాసులో వాళ్ళనీవీళ్ళనీ మాయచేసి డబ్బులాగుతూ జీవనంగడుపుతున్నాడు. భవానిదగ్గరవస్తువులూ—డబ్బూ వున్నట్టు లంటిహోమ్ సర్వర్లుచెప్పారు. అదీగాక భవాని చాలాఅంద గత్తె. ఆమెను వీధికిబెట్టి పదిమందివల్లా డబ్బులాగాలని చూశాడు.

భవానిని వేపేరిలో అదివరకే కుదిర్చిన డాబాలో పెట్టాడు. అక్కడో దానికోటి ఏమీలేదు. రెండుమూడు రోజులన్నీ దర్జాగా నడిపించాడు. నాలుగోరోజునించి అయిదారుగురు స్నేహితులొచ్చేవారు. వాళ్ళంతా పేకాట, తాగడం, అల్లరి మొదలెట్టారు. ఇదంతాచూసి భవాని బిక్కచచ్చింది.

మరునాడు మధ్యాహ్నం ఫిలిం డైరక్టరు స్నేహితుణ్ణంటూ ఒక వొచ్చిసరసాల కుపక్రమించాడు. వాణ్ణిమందలించింది. వాడు డైరక్టర్ని ఓగడ్డిపరకలాచూసి మాట్లాడుతో—వాడిటో పీలోబడ్డావు. నీదగ్గరున్న దంతాగోకేసి నాలుగురోజుల్లో—నిన్ను తుక్కక్రింద చలగ్గొట్టించి—పదిమంది వల్ల పదివందల్లాక్కుని గెంటేస్తాడు. నాతోవస్తివా నిన్నందలమెక్కిస్తా నన్నాడు.

భవాని వీణ్ణిమోసంచేసి బయటకు పోవాలని—మీరు సాయం కాలం ఏడుగంటలకొస్తే చల్లగా జారిపోదామని చెప్పింది. వాడు చంక లెగరేస్తూ వెళ్ళాడు. వాడెళ్ళడంతోటే— తనపెట్టెసర్దుకొని తలుపుపైన గొళ్ళెంపెట్టి, సూట్‌కేసు చేత్తోపుచ్చుకొని వేపేరినుంచి బయలుదేరి— అయిమూలగా మింటిబిల్డింగ్సు పక్కనించేపోతూంది.

బలరామ్ ఈమెను ఆనవాలుపట్టి గబగబా మేడదిగి యివతల కొచ్చి పలకరించాడు. ఆమెబొరుమంది. సంగతంతా తెలుసుకున్నాడు— తనవల్లగదా ఆమె యీస్థితికొచ్చిందని పశ్చాత్తాపపడి—ఆమెని తనబసకి తీసికెళ్ళి తనసంగతంతా చెప్పి—ఆమెకి నమ్మకం కలిగించి ఆమెతో—

'నీకేమీ భయంలేదు. నావల్ల నీకపకారం జరిగింది. అందుచేత నిన్ను నెత్తినబెట్టుకోటాను'

'చాలామంది యిలాగే చేశారు'

'నన్నలాతలచవద్దు'

'నాకేమీ ధైర్యంచిక్కడంలేదు'

'ఏంచేస్తే ధైర్యంచిక్కుతుంది'

'నాకేమీ పాలుపోవటంలేదు'

'మనస్సుపాడుచేసుకోకు — నేను చాలా పశ్చాత్తాపం పడుతున్నాను'

'చెయ్యి కాలింతర్వాత ఆకులట్టుకోడం'

'అలాగే జరిగింది—నాకూ ఎవ్వరూలేరు—అంచేత యిద్దరం కలిసి కలకత్తాపోయి అక్కడుందాము—

అంటే ఆమెకేదో నమ్మకం కలిగి—నన్నేంజేసినా నీదేభారం—నీతోనే వుంటానని అంది. బలరామ్—ఆరాత్రి మెయిలుకే భవానిని తీసుకొని కలకత్తాకి బయల్దేరాడు.

బాలాంబ కోవెలనుంచి సాయంకాలం యింటికొచ్చేసరికి బలరామ్ అర్జంటుగా రాజమండ్రీ వెళ్ళాడని నౌకర్లుచెప్పారు. సరేననుకుంది. మర్నాడు దండెం బొట్టుపెట్టె తీస్తే చీటీకనిపించింది. వాత్రి బలరామ్‌ది విప్పి చదివింది దాన్లో—

'నాకోసం నిరీక్షించొద్దు—నేను దేశాంతరాలకిపోతున్నాను. నా మాటతలపెట్టక నన్ను మరిచిపో! రామప్రసాదెంతమోసగాడైనా అతడు నీభర్త—పిచ్చివాడై వీధులవెంటదుక్కుంటున్నాడు. అది నీకు—నాకూ కూడా శ్రేయస్సుకాదు. అతనిని తిరిగిచేరదీసి—మన్నించి ఏలుకో—ఇది నామనఃపూర్వకమైన సలహా! అంతేగాక పూర్తిగా కాకపోయినా—నావల్ల మీదంపతులకి కొంత అపకారం జరిగింది. అదేనన్ను బాధించింది. నేను దేశదిమ్మరినై పోడానికదే కారణం—వరప్రసాద్ ఇప్పటికి బుద్ధి తెచ్చుకునే వుంటాడు—

అనివుంది. బాలాంబ ఆచీటీచదువుకుని—మగాడంటేనేమాయ—నమ్మినవాళ్ళు గోతులో పడ్డట్టు— తెగనికత్తితో గొంతుకోసుకున్నట్టు—ఛీ! జన్మెత్తిగానేసరా! సిగ్గూ—బిడియమూవు డద్దూ—

అనుకొని ఆచీటీని సహస్రవక్కలుచేసింది— ఎందుకో చెక్కుబుక్కు తీస్తే ఏభైవేలు—ఖజానాతెరిస్తే యిరవైవేలు— గల్లంతు— నాకిలాంటి ప్రాయశ్చిత్తం కావలసిందే—

అని దిగాలుపడి కూలబడిపోయింది. ఆదేసమయంలో ఆవీధివెంబడి 'రాణీవాసం—రాణీవాసం' అంటూ ఓపిచ్చివాడు గంతులేస్తో తిరుగుతున్నాడు – చటాలునలేచి బాలాంబ నౌకరిచేత ఆపిచ్చివాణ్ణి పిలిపించి—

'ఎవరునువ్వు?'

'రాణీవాసం'

'అలా యెందుకంటావు?'

'రాణీవాసం'

'నీపేరేమిటి?'

'రా మ ప్ర సా ద్'

అనడంతోనే బాలాంబ అతన్ని యింకా దగ్గిరగాపిలిచి— రెండు చేతులూపట్టుకొని— రాణివాసం ఎక్కడ— అని అడిగింది.

'అంతారాణివాసమే'

'నీకు మంచిబట్టలిస్తాను కట్టుకుంటావా?'

'నువ్విస్తే కట్టుకోను— రాణివాసం యివ్వాలి'

'రాణివాసంఏది'

## ఇదే—

## రాణివాసం

ప్రపంచమంతా యిదే తంతుఅనుకోకండి— మగాడంటే మాయ అనేఆడది— ఆడదంతక్క నాతగిందే- ఇంతసాహసమూ అనేమగాడూకూడా నెత్తినాయనమ్మలే అనినమ్మండి.

సంపూర్ణం.

---

మల్లాదివారి రాబోవు

## క్రొత్తనవలలు:—

1 లైన్ గరల్

2 బేగం బమ్మన్

3 మూడుముళ్ళు

4 ఆడ దాంపత్యం

5 మగ దాంపత్యం

---

భాస్కరముద్రాక్షరశాల, రాజమండ్రి.

## రాబోవు నవలలు



# శ్రీ హాసాపురం వారివి

1. భర్తలేని భార్య
2. భ్రమ
3. నైటు షికార్
4. హానీమూన్

వలయువారు:—

పి. వి. రామయ్యా సన్, రాజమండ్రి.

రామహంస ప్రెస్, రాజమండ్రి.